# నా చుట్టూ చైతన్యపు విద్యుత్తు!

వాడికొకటే ధ్యాస
క్రూరత్వంలో కొత్త పద్ధతులెలా కనిపెట్టాలని
నా తపన వేరు
అత్యాచారాలనెలా అంతమొందించాలని
నరకం అంటే కోపం ఎందుకు?
ఆకాశాన్ని నిందించడం దేనికి?
లోకమంతా అన్యాయం నిండి వుంటే
రా! ఎదుర్కొని పోరాడుదాం
నేను కొద్ది క్షణాల అతిథిని
పొద్దు పొడుపుని సూచించే వేగుచుక్కని
ఆరిపోవడం అంటే భలే ఇష్టం నాకు
నా చుట్టూ గాలిలో
చైతన్యపు విద్యుత్తు ప్రవహిస్తోంది
పిడికెడు బుగ్గి క్షణికమైంది
వుంటే ఎంత? లేకుంటే ఎంత?
సుఖంగా వుండు తమ్ముడూ
సాగిపోతున్నా పయనమై!

–భగత్‌సింగ్

(మార్చి 3, 1931 లాహోర్ సెంట్రల్ జైల్లోంచి తన చిన్న తమ్ముడు కులతార్‌సింగ్‌కి భగత్‌సింగ్ రాసిన చివరి ఉత్తరం లోంచి)

# ప్రస్తావన

క్రీ॥పూ॥ 500 సంవత్సరాలపూర్వం గతితర్కాన్ని మొట్టమొదటిసారిగా చెప్పిన గ్రీకు తత్వవేత్త హిరాక్లిటస్ యుద్ధంపై తన అపారమయిన విశ్వాసాన్ని ప్రకటిస్తూ, "War is father of all, King of all. Some it makes gods, some it makes men, some it makes slaves, some free. we must realise that war is universal, and strife is justice, and that all things come into being and pass away through life." అంటాడు. స్వీయ అస్తిత్వాన్ని సంరక్షించుకోవడం కోసం మనిషి సంఘటనల్తో సంఘర్షించక తప్పదు. అయితే పోరాటమనేది కేవలం భౌతికపోరాటాల్ని లేక శారీరక కలహాల్ని నిర్వచించదు. అనాదిగా మనషిని అతడి మానసిక సంఘర్షణే గతి మార్గం పట్టించింది. గతించిపోయిన ఘటనల క్రమాన్ని కూడా చరిత్ర జ్ఞాపకాల్లో పదిలంగా భద్రపరిచింది. మన పూర్వికులైనటువంటి ఆదిమ మానవుల నిరంతర సత్యాన్వేషణ మాత్రమే మానవులుగా మనకి ఈనాడు గమన క్రమాన్ని చూపుతుంది. అయితే ఈ క్రమం ప్రతీ తరానికి విధిగా అవగతం కావాలని నియమం లేదు. అందులోనూ ఈనాడు వివిధ రకాలైన మూఢత్వాలు మనిషిని పీడిస్తున్నాయి. అనుక్షణం పాలించేందుకు ప్రయత్నిస్తున్నాయి. "Science like philosophy, has sought to escape from the doctrine of perpectual flux by finding some permanent sub-stratum aimd changing phenomena." అంటాడు బెట్రాండ్ రస్సెల్ తన 'History of western Philosophy" అనే గ్రంథంలో. సామాజిక పరిణామాన్ని (Social Evolution) క్రమబద్ధం చేయడానికి భావచైతన్యం ఒక తప్పని సరి పరిణామం. చారిత్రక సమూహంలో ఇదొక ముఖ్య మైన కార్యక్రమం. దీనిని త్వరితం చేయడమే ప్రతీ విప్లవకారుడి ప్రధమ బాధ్యత. అదే ఈ అక్షరాలకి ప్రేరణ. నా ఆశయాలకి ధారణ.

"సమాజంలో అరాజకత్వం పెరిగిపోతోంది."
"దేశంలో అరాజకత్వం మితిమీరిపోతోంది."
"మనుషుల్లో అరాజకత్వం పేట్రేగిపోతోంది."

చిన్న తగాదా మొదలుకుని హత్యలు, మానభంగాలు, దోపిడీలు ఇతర నేరాలు లేదా తీవ్రవాదులుగానో ఉగ్రవాదులుగానో హింసకి పాల్పడేవారూ, చివరికి ఫాసిస్టులని కూడా అరాజకవాదులనే అంటున్నారు. ఆ పదం ఏం పాపం చేసుకుందో తెలీదుకానీ ప్రతీ చోటా చేయని తప్పులకి శిక్షననుభవిస్తూ మౌనంగానే ఏడుస్తోంది. ఎక్కడచూసినా ఈ మాటే. ప్రసారమాధ్యమాల సంగతి సరేసరి. చివరికి సామాన్యులు సైతం ఇష్టమొచ్చినట్లు ఈ పదాన్ని వుపయోగిస్తూ అసలర్థాన్ని సమాధి చేసేసారు. అయినా తప్పు వారిది కాదులెండి. మేధా(తా)వుల దగ్గర్నించి భాషా శాస్త్రవేత్తల్తో సహా రాజకీయనాయకులూ, సామాజిక కార్యకర్తలూ అందరూ వాడగా లేంది వారు మాత్రం వాడితేపోయేదేముంది. అల్లాడిపోయే అరాజకవాదుల అమాయక హృదయాలు తప్ప. భాషాపరంగా అరాజకత్వం అనే పదాన్ని భ్రష్టు పట్టించినంతలా మరే పదాన్ని మన భాషావేత్తలు పట్టించలేదు. తిరోగమనవాదులూ, కులపిచ్చి సంఘాలు, మతరొచ్చు బోధకులు, రాజకీయ కుచ్చుటోపీ నాయకులూ ఆఖరికి కొమ్ములు తిరిగిన కమ్యూనిస్టు డబ్బావాలాల్తో సహా అందరిదీ అదే మార్గం. వక్రమార్గం. ఉన్న ఆధారాన్ని నాశనం చేసుకుని నూతన దైవం కోసం ఆకాశంలోకి పిచ్చిచూపులు చూసే అంతరాత్మలులేని పరమార్గం. వారి వైకల్యపాలోచనల్ని. కాస్త సవరిస్తూ సామాన్యులకి అరాజకత్వాన్ని ప్రాధమికంగా పరిచయం చేయడమే నా ఉద్దేశం. అదే బద్ధంగా బతికే ప్రతి అక్షర సైనికుడికీ నేనిచ్చే సందేశం.

బెంగుళూరు
2010

మీ...
గౌరవ్

# అరాజకత్వం అంటే ఏమిటి?

## అరాజకవాదులు హింసకి వ్యతిరేకం !

అసలు హింసనే పదానికి పర్యాయపదంగా అరాచకత్వం అని వాడుతున్న వ్యవస్థలో అరాజకత్వమంటే అహింసా సిద్ధాంతమని వల్లించడమూ, అందుకాధారాలు చూపించడమూ సాహసం అవునో కాదో నాకయితే తెలీదు కానీ అసత్యాలకీ - అర్ధసత్యాలకీ విరుద్ధంగా చేసే యత్నమే ఇది. ప్రతిరోజూ వేలమంది ఆకలిదప్పులతో అలమటిస్తూ అనేక ఈతిబాధలనుభవిస్తుంటే, రోజుకి కొన్ని కోట్ల రూపాయల ధనం ప్రపంచవ్యాప్తంగా ప్రతీ దేశమూ ఆయుధ సంపత్తిని పెంచుకోవడానికి వెచ్చిస్తోంది. శాంతి పేరుతో యుద్ధోన్మాదపు మత్తులో జోగుతూ దొంగతనంగా హింసని ప్రేరేపించే ప్రస్తుత ప్రపంచపు ప్రభుత్వాలు భయంకరమైన రక్తపిశాచులుకానీ అరాచకవాదులో లేదా అరాజకత్వ సిద్ధాంతమో కాదు. అరాచకవాద ఆద్యుడైన ఫ్రెంచ్ రచయిత ప్రొధెన్ అనుచరులు తర్వాతికాలంలో సాధారణ ఆక్షేపణల్ని కూడా వ్యతిరేకించారు. అంటే కనీస నిరసనల్ని కూడా కాదన్నారన్నమాట. ఈ తరహా వర్గం వారు విప్లవం అనేదాని భౌతిక స్వరూపం మొత్తాన్ని నిరాకరించారు. వీరే పరస్పరవాదులుగా పిలవబడుతూ అత్యంత శాంతి కాముకులుగా వ్యవహరించారు. అయితే ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. సహజంగానే విప్లవవాదుల సమూహాలుగా ఉన్న అరాజకవాదుల సంఘాల్లోని అసాంఘిక మూకల ప్రమేయం వలనో, లేదా ఏకపక్ష నిర్ణయం వలనో చరిత్రలో అరాజకవాదులపై నెత్తుటి మరకలూ, హంతక ముద్రలూ పడ్డాయి. భయంకరమైన పరిపాలననీ, నియంతృత్వ ప్రభుపాలననీ నియంత్రించడానికి కూడా అలాంటి సంఘటనలు జరిగాయి.

వాటిలో ఫ్రాన్స్‌దేశపు అధ్యక్షుడైన సాడీకార్నాట్ మరణం (1894), ఆస్ట్రియాకి చెందిన ఎలిజెబెత్ (1898) మరణం, ఇటలీకి చెందిన మొదటిరాజు ఆమ్‌బెరట్ మరణమూ ముఖ్యమైనది. రష్యా విప్లవానికి సంబంధించి అరాజకవాదులపై అనేక అపవాదులు ప్రచారంలో ఉన్నాయి. అయితే అరాజకత్వ మూల తత్వానికి ఇవేవీ కూడా ప్రమాణాలుకావు.

## ప్రభుత్వమంటే ఏమిటి?

ఒక యాజమాన్యానికి బానిసకలకూ మధ్య నుండే సంబంధమే ప్రజలకూ ప్రభుత్వాలకూ మధ్య ఉంటుంది. ఏ ప్రభుత్వమూ ఇందుకు మినహాయింపుకాదు. ప్రజానీకాన్ని పీడించడంలో ప్రతీ పాలకవర్గం తీరూ కొన్ని తారతమ్యాలతో తప్ప ఒక్కటే. గొర్రెలు కాపరికీ, గొర్రెలమందకీ గల సంబంధమే ఇది. గొర్రెల్ని తోలడానికి, కొట్టడానికీ, చంపి తినడానికీ ఏ కాపరికా ఆశుంటుంది. గొర్రెల్ని అడ్డంపెట్టుకుని నూలు అమ్మి డబ్బు చేసుకోవడానికీ లేక మందని పెంచుతూ మాంసం వ్యాపారం చేయడానికీ సామాన్యంగా అతడు హక్కుదారుడౌతాడు. గొర్రనేది ఒక పెంపుడు జంతువనీ, ప్రమాదరహితమైనదనీ అనవసరంగా మరో జీవిని హింసించే హక్కు తనకు లేదనీ,... ఇవన్నీ ఎవరికీ పట్టవ్. అలాగే పౌరులనే వాళ్ళు కూడా మనుషులేనని, వాళ్ళకీ భావాలూ, బంధాలు వుంటాయనీ సాధారణంగా ప్రభుత్వాలకీ, ప్రధానంగా అందులోని ధనికవర్గాలకీ పట్టదు. అసలు కడుపు కోసం కష్టపడే వర్గమంటేనే వారి దృష్టిలో అధములు. పుట్టడం, చావడం తప్ప ఇంకేమీ తెలీనివాళ్ళు. తినడం, కనడం, తొంగోడం తప్ప మరేమీ రానివాళ్ళు. అలాకాక వారిలో ఏ కొద్దిపాటి చైతన్యం కనబడినా దాన్ని వెంటనే కాలరాసేదాకా నిద్రపోరు. ఆ పెద్ద మనుషులూ, వారి ప్రభుత్వమూ. జనాభాలో అతి తక్కువ శాతమున్న కొందరు

బడాబాబులు నిర్ణయాలే ప్రభుత్వ నియమాలుగా అమలవు తుంటాయి.

## ప్రజాస్వామ్యం అంటే ఏమిటి?

మనమనుకుని వుంటున్నది మాత్రం కాదు. ఇది మరేదయినా అవ్వచ్చునేమోగానీ ప్రజాస్వామ్యం అవదు. ఇది ప్రజలకోసం ఎన్నుకోబడడం కాదు. ప్రజల్లోంచి నాయకులు రావడం లేదు. ప్రజలు తమని తాము పాలించుకోవడం లేదు. ఒక్క భారతదేశంలోనే కాదు. ప్రపంచంలో ఎక్కడా పరిపూర్ణ ప్రజాస్వామ్యం అమలవడం లేదు. ఉద్యోగస్వామ్యాన్ని, అధికారస్వామ్యాన్నీ, నియంతృత్వాన్ని, ఏకఛత్రాధిపత్యాన్ని.... ప్రజాసామ్యంగా పిల్చుకుంటున్నాం. ప్రజాస్వామ్యమంటే ప్రతీ వ్యక్తి అస్తిత్వాన్నీ, అభిప్రాయాన్నీ గౌరవిస్తూ, వ్యక్తిగా అతడి హక్కుల్ని, బాధ్యతల్ని నైతికంగా, సాంఘికంగా క్రమబద్ధీకరిస్తూ, పరస్పర పౌరసంబంధాల్నీ, మానవ సంబంధాల్ని మెరుగుపరచ ప్రయత్నించడమే ప్రజాసామ్యం. ప్రజాస్వామ్యంలో ఇతర వ్యక్తిగత అస్తిత్వానికి లేదా సామాజిక సంస్కరానికి భంగం కలిగించనంత మేరకూ వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్రాలకి అత్యధిక ప్రాముఖ్యత వుంటుంది. వ్యక్తి విధానాలకి నష్టం వాటిల్లని అభిప్రాయాల పై కార్యశీల చర్చల ద్వారా ఆచరణాత్మక వైఖరి అవలంభించడం జరుగుతుంది. అంతేగాని అయిదేళ్ళకొకసారి నామమాత్రపు ఎన్నికలు ఆటలు ఆడడం ఉండదు. ప్రభుత్వం అనేది ఉన్నవాడికి ఉంపుడుగత్తెగా మారడమూ ఉండదు.

## అరాజకత్వం వ్యక్తిగతవాదం కాదు !

అనేక మంది కవులూ రచయితలూ, ముఖ్యంగా ఎర్రజెండా మేధావులూ అనుకుని లేదా కావాలని ప్రచారం చేస్తున్నట్లు అరాజకత్వం వ్యక్తిగతవాదం కాదు. రాజు లేక ప్రభుత్వం లేకుండా ప్రజలు తమని తాము పరిపాలించుకోవడం సమిష్టి

సహకారంతోనే సాధ్యం. అటువంటప్పుడు అరాజకత్వం కేవలం వ్యక్తివాదమేనన్న విమర్శ వివేచనతో కూడుకున్నది కాదు. ఒకవేళ అదే నిజమయితే చరిత్రలో ఏ అరాజకవాది కూడా తన స్వార్థం కోసమో లేక కుటుంబం కోసమో ఏ కార్యమూ నేరమూ చేయలేదు. ఏ మతాన్నో, దేశాన్నో, పార్టీల్నో ఆశ్రయించి ఉన్మాదావస్థకి లోనుకాలేదు. ఏం చేసినా ప్రజల కోసమే చేశాడు. సమాజం కోసమే చేశాడు. అంటే అరాజకవాద లక్షణం సమిష్టితత్వమేనన్న మాట. సామాన్య జనాన్ని పీడించే ప్రభుత్వ సమూహాన్ని వ్యతిరేకించడం చేత మాత్రమే అరాచకవాదులు అపవాదుపాలై ఉండొచ్చు. అంతేకానీ అనవసరంగా వ్యక్తిగత స్వార్థాన్ని సమర్థించారనడం సరికాదు. సామ్యవాదపు మూలసూత్రమైన ఉత్పత్తులపై సాంఘిక యాజమాన్యాన్ని అరాజకత్వం నిస్సంశయంగా సమర్థించడమే కాకుండా అందుకు తీవ్రంగా పోరాడుతుంది కూడా. అదే అరాజకత్వ నిజస్వరూపం.

**అరాజకత్వం అపరిణామం కాదు !**

అరాజకవాదం గతితత్వమే కాని స్థితితత్వం కాదు. అంటే తప్పనిసరిగా మారే సామాజిక ప్రకృతిపర మార్పుల్ని అన్వయించుకుని, అవసరమయినవి ఇముడ్చుకుని ముందుకు సాగిపోయేదే కాని ఉన్నచోటనే నిలబడి అర్థాచరణలు లేని సిద్ధాంతాల్ని వల్లించేది కాదు. ఉనికే లేని విప్లవాలను ఉచ్చరించేదసలే కాదు. అరాజకత్వ ప్రధాన విధి ఆచరణ మాత్రమే. వంద వాదాల్ని వినిపించేకన్నా ఒక్క కార్యాన్ని చేసి చూపించడంలోనే అరాజకత్వం తృప్తి పడుతుంది. తద్వారా తాత్వికావగాహనకు గాను ప్రాథమిక సూత్రాల్ని తెలియజేయడంతోనే సామాజిక భావచైతన్యానికి వ్యక్తి పునాది వేస్తుంది. ఈ క్రమంలో సమాజంలో వ్యవస్థీకృతమై ఉన్న సాంప్రదాయ అవిలువల్ని, మతమౌఢ్యాన్ని, ఇతర అపరిణిత

విశ్వాసాల్ని పునాదివేళ్ళతో సహా కదిలించి, పెకలించి, పారేయడానికి ప్రయత్నం చేస్తుంది. వర్తమాన సమస్యల్ని పరిష్కరిస్తూ భావితరాలకి భావనిర్దేశం చేసే అభ్యుదయ విధానాలని నిరంతరం నూతన గమన నియమాల్లో నవ్వీకరించుకుంటూ పరిణామ ప్రవాహంలో భాగమవుతుందే కాని అపరిణామంగా స్థిరమైన పరిస్థితిని సంరక్షించుకుంటూ అపరిపక్వత్వాన్ని అవలంభించబోదు.

## అరాజకత్వం అభావ సిద్ధాంతం కాదు !

అంటే భావరాహిత్యమైనదికాదు. అరాజకత్వానికి నిర్దిష్టమైన స్వభావం ఉంది. దాని భావాల్తో దగ్గరి బంధం గల వాదాల్ని సమర్ధించే బాధ్యతా ఉంది. వివిధ వాదాల్లోని భాగాల్ని తీసుకుని ఆత్మలేని శరీరంతో, సొంత భావాల్లేని ఇతర సిద్ధాంతాల మాంసంతో తన మనుగడ కొనసాగించేది కాదు. ప్రాకృతిక నియమాల్ని అనుసరించి, మానవ సమాజ క్రమాన్ని భౌతికదృష్టితో వీక్షిస్తుంది. సత్యాన్వేషణకై ఎల్లప్పుడూ సంసిద్ధంగానే ఉంటూ, సార్వజనీనత్వానికి ప్రాధాన్యతనిస్తుంది. అంటే, సామాజిక స్థితిగతుల్ని ఉన్నతీకరించే ప్రయత్నం చేస్తూనే వివిధ రకాలుగా విభజితమై ఉన్న మానవకోటిని ఏకత్రాటిపైకి తీసుకురావడానికి పలు కార్యక్రమాల్ని విప్లవాత్మకంగా చేపడుతుంది. అందులో భాగంగానే సామాన్య ప్రజల ఆలోచనలో, ఆచరణలో మార్పు తేవడానికి తనవంతు కృషిచేస్తుంది. అంటే సామాన్య భావగమనాన్ని చైతన్యపరచి విప్లవీకరించేందుకు చూస్తుందన్నమాట. అయితే ఇతర సిద్ధాంతాలకి ఉన్న ప్రచారమూ, ఆర్భాటమూ అరాజకత్వానికి వుండదు. ఎందుకంటే అరాజకవాదుల్ని వక్రదృష్టితో చూసేవారే తప్ప యదార్ధంగా పరిశీలించేవారు అరుదు. అదే అరాజకత్వ అజ్ఞానానికి అసలు కారణం.

## అరాజకత్వం అహేతుత్వం కాదు !

మానవుడు అనాదిగా ప్రకృతి హేతుత్వంపైనే తన జీవితం కొనసాగిస్తున్నాడు. సహజ సిద్ధమైన ధర్మాలననుసరించే తన అస్తిత్వాన్ని అభివృద్ధి చేసుకుంటున్నాడు. అందుకు విరుద్ధంగా అతడి బాహ్య ప్రవర్తన ఎంత అపరిణితంగా వ్యవహరించినా ప్రాకృతిక జీవిగా హేతుత్వం అంతరికంగా అతనిలో గోచరించక తప్పదు. దేవుణ్ని, దెయ్యాల్నీ, భగవంతుడ్ని, భూతాన్నీ, మాయల్నీ, మంత్రాల్నీ, మతాన్ని, మూఢత్వాన్నీ ఇలా ఎన్ని అహేతుత్వ విశ్వాసాలుద్భవించినా, వీటన్నింటికీ మూలం అతడి ఆలోచనల్లోని హేతువాదమే. ఆచరణాత్మక భౌతికవాదమే. మనిషి నడవడిక నుంచి నాగరికత వరకూ అతడి నరనరాన జంతువులతో కల్సి మసలిన మృగాల నాటి అతడి వారసత్వపు స్మృతి చిహ్నాలే తొంగి చూస్తుంటాయి. పశుప్రవృత్తిని నిరోధించడం కోసం అతడు చేసే పోరాటం మొదలుకుని నవనాగరికతని వృద్ధి చేసేందుకై అతని ఆరాటం వరకూ అతనికి మహోపకారణం చేసేది, మొదటి నుంచి అతన్ని కనిపెట్టుకు చూసేది హేతుత్వమే.

## స్వేచ్ఛా స్వాతంత్రాలపై అరాజకత్వం !

"Man is isolation can have no awareness of his liberty... Liberty is therefore a feature not of isolation but of interaction, not of exclusion but rather of connection." అంటాడు మైకెల్ బకునిన్. అరాజకవాది ఎప్పుడూ వ్యక్తిగత స్వార్థాన్ని కాంక్షించడు. సామాజిక శ్రేయస్సుకై మాత్రమే తపిస్తాడు. ఈరోజు అన్ని ప్రభుత్వాలూ అమెరికాలాంటి అడ్డమయిన రాజ్యాలు సిగ్గులేకుండా వుపయోగిస్తున్న స్వేచ్ఛా, స్వాతంత్రం, సమానత్వం అనే పదాల లోతుల్ని తెల్సుకోవాల్సిన అవసరం తప్పకుండా ఉంది. "No man can acheive his own emanci-

pation without at the same time working for the emanicipation of all men around him" అంటాడు బకునిన్. సమాజ సమిష్టితత్వాన్ని కాపాడుకోకుండా కేవలం గుంపులగానో, ముఠాలగానో తమ అస్తిత్వాన్ని నిలుపుకోవడం కోసం చేసే దుందుడుకు ఘటనలన్నీ విప్లవ కార్యాచరణ కావు. ప్రజానీకంపై అలాంటి వాటి ప్రభావం కూడా తాత్కాలికంగా అంతంతమాత్రంగానే వుంటుంది తప్ప భావ చైతాన్యాన్ని ఉన్నతీకరించేందుకు పనికిరాదు.

**దైవత్వ, మత భావనలపై అరాజకత్వం !**

ఆధ్యాత్మివాదమంతా అసత్యమేనని అరాజకవాద నిశ్చితాభిప్రాయం. ఏ మతానికీ ఇందులో మినహాయింపు లేదు. బకునిన్ రచించిన "దేవుడూ-రాజ్యము" (God and state) అనే గ్రంథంలో "Idea of god implies the abdication of human reason and justice, it is most decisive negation of human liberty and necessarily ends in the enslavement of mankind both in theory and in practice." అంటాడు. మానవ వైజ్ఞానిక పరిణామాల్ని అడ్డగించి అనేకమంది శాస్త్రవేత్తల్ని దారుణంగా హింసించి చంపిన మతమూ మతవాదులూ ఈ రోజు మా మతాల్లోనే శాస్త్రీయత వుందని ప్రచారం చేసుకుంటున్నారంటే వాళ్ళ పిచ్చి, చికిత్సకీ అందనంత ముదిరిపోయిందనేది స్పష్టం. ఈ దౌర్భాగ్యుల శాస్త్రీయతకి వీళ్ళ విశాస్వాల కొలమానం చాలు.

**అరాజకత్వం విలువల్ని విశ్వసిస్తుంది !**

మహాకవి షెల్లీ గురువు,మామగారు అయినటువంటి గోడ్విన్ మహాశయుడు అనామధేయంగానే అరాజకత్వ ప్రాథమిక సూత్రాల్ని తన "Political Justice" అనే అద్వితీయ గ్రంథంలో

పొందుపరిచారు. అత్యంత వివరణాత్మకంగా మానవుడి సహజ ప్రాకృతిక తాత్విక భావనల్ని అందులో విశ్లేషించాడు. సమాజం సహేతుకంగా సాగడానికి గానూ కొన్ని సశాస్త్రీయమైన సూత్రీకరణాలు చేశాడు. సాంప్రదాయికమైన సంఘ కట్టుబాట్లని వ్యతిరేకిస్తూ విప్లవాత్మకమైన ప్రతిపాదనలు చేశాడు. మనిషి సంతోషంగా, సమిష్టిగా జీవించడానికి అవసరమయిన భావాల్ని మార్గదర్శకత్వంగా రూపొందించి రచించాడు. ఆ తర్వాత ఆ ధోరణిననుసరించిన ప్రౌథిన్, బకునిన్, క్రోప్టకిన్ మొదలయిన మేధావులు సైతం తమ వంతు ప్రయత్నాల్ని ఆచరణాత్మకంగానూ, భావచైతన్యం ద్వారానూ చరిత్రలో నిక్షిప్తం చేశారు. ఒక ఉన్నత వ్యవస్థ స్థాపన కోసం పాటుపడ్డారు. వారి సూత్రీకరణలూ, సిద్ధాంతాలూ అన్నీ మానవ విలువల్ని ఈనాటికీ రక్షిస్తూనే ఉన్నాయి కానీ ధ్వంసం చేయలేదు.

## అరాజకత్వం మానవతా సిద్ధాంతం !

మానవవాద సహితంగానే అరాజకవాదం ఉంటుంది తప్ప మానవవాద రహితంగా మనలేదు. ఎన్ని ప్రయత్నాలుద్భవించినా, ఉద్యమాలు జనించినా అవన్నీ మానవుడి సాంఘిక జీవనాన్ని వున్నతీకరించానికి ప్రయత్నించేవే తప్ప ఉన్న స్థితిలోనే అతడి గతిని చంపి పూడ్చిపెట్టేవి కాదు. “The true standard of the conduct of one man towards another, is Justice... Justice is a rule of the utmost universality and prescribes a specific mode of proceed-ing, in all affairs by which the happiness of a human being may be affected”. అంటాడు గోడ్విన్ తన Political Justice లో. ప్రస్తుత న్యాయానికీ, ధర్మాలకీ, చట్టాలకి అతీతమైన మానవైక వ్యవస్థ స్థాపనే లక్ష్యంగా అరాజకత్వం అవలంభిస్తుందనేందుకు ఇది చాలు. మానవుడి సహజ

సృజనాత్మకత సమిష్టిగా వృద్ధి చెందడానికి అరాజకత్వ వ్యవస్థని మించినది లేదనడం సమంజసమేననిపిస్తుంది.

## అరాజకత్వం మానవ పరమావధి కాదు !

ప్రగతి కాంక్షించే ఏ వాదమూ కూడా మొండి వైఖరితో వ్యవహరించదు. అలాగే అరాజకత్వాన్ని సమర్థిస్తున్నామంటే దానర్థం, ప్రస్తుత ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా అని మాత్రమే తప్ప అరాజకత్వానికి మినహా మనిషికి గత్యంతరం లేదనీ లేక మరో వాదమేదీ భవిష్యత్తులో రాదని దబాయిస్తే అరాజకత్వానికీ, ఆధ్యాత్మికత్వానికీ వ్యత్యాసం ఉండదు. సమాజ పరిణామంలో ఒకానొక దశకి సంబంధించిన భావ చైతన్యంగానే అరాజకత్వాన్ని గుర్తించాల్సి వుంటుంది. అంతేకాని అసలంతమే లేని శాశ్వత సమాజాన్ని మూస స్థితిలో అరాజకత్వం ప్రమాణం చేయదు. మానవ ప్రామాణికం కాని భావాన్ని సమర్థించదు. అందర్నీ సమంగా వీక్షించే సామ్యవాద వ్యవస్థలో సైతం మానవ సృజనే మరో ఆవిష్కరణ కోసం అవిరామంగా కృషి చేస్తూ ఉంటుంది తప్ప, సాధించిన దాంతో సంతృప్తి పడి నిర్లిప్తంగా ఉండదు. ఇతర అభ్యుదయ శక్తులతో, వ్యక్తులతో సమిష్టిగా కల్సి నవసమాజం కోసం సామాజిక వ్యవసాయం చేస్తూనే తన సొంత అంతరాత్మని నిరంతరం అభివృద్ధి చేసుకుంటుంది.

## అరాజకత్వం విధ్వంసక సిద్ధాంతం కాదు !

వినాశనానికీ – విధ్వంసానికీ సమాంతరంగా వాడబడుతోన్న అరాజకత్వం శాంతి కాముక సిద్ధాంతం. కొన్ని లక్షల కోట్ల మందిని మతం బలితీసుకుంది. ఆధునిక నాగరిక దేశాల్లో ఆ స్థానాన్ని రాజ్యం కూడా ఆక్రమిస్తుంది. అయితే వీళ్ళందరిలో ఎవరు ఏ ఉత్పాతం సృష్టించినా అరాజకత్వ పదంతోనే దూషిస్తున్నారు. అరాజకవాద మహోన్నత స్థాయికి వీళ్ళ పేలవమయిన పేకతత్వాలు సరిపోవు. వీళ్ళ వాదాలన్నీ వాడిగా,

అత్యంత పకడ్బందీగా నిర్మించిన పేకమేడలే. గాలివాన రానంతవరకే వాటి ఆయుష్షు. అయితే ఈనాడు ముఖ్యంగా మతం కొత్త రంగు ముఖంతో బలం చేకూర్చుకుంటోంది. తనకి వ్యతిరేకంగానున్న వాటిని సైతం తన వాదాలేనని లజ్జ లేకుండా వాదిస్తూ ప్రచారం చేసుకుంటోంది. ఈ మతాలకీ ప్రభుత్వాలకి అసలు మానవత్వమనేదే ఉండదు. అదే వుంటే ఈనాటి ప్రపంచం పరిస్థితి మరో విధంగా ఉండేది. సామాన్యుడు సైతం మనుగడ సాగించేలా ఉండేది. నాయకుల కోరికలు కోట్లకి కోట్లు కూడబెట్టు కుంటుంటే ప్రజల కడుపులు కూడు కోసం కాలుతున్నాయి.

## అరాజకత్వం మాత్రమే ఆకలికి పరిష్కారం !

"The absolute control of the means of communication by the governments of the victorious powers has prevented the General pubic from knowing anything Which might prove disagreeable for those powerful nations which hold undisputed sway over the earth and the millions of human beings that inhabit it" అనే వాక్యాల్తో ఎం.ఎన్. రాయ్ తన "భారతేదశంలో ఆకలి – విప్లవమూ" అనే వ్యాసాన్ని ప్రారంభించాడు. ఈనాటికీ మార్పేమీ లేదు. పైగా గణాంకాలని బట్టి చూస్తే కాలే కడుపులూ, మాడే బ్రతుకులూ నానాటికీ పెరుగుతున్నాయి తప్ప తరగుతున్నట్లు కనిపించడం లేదు. దానికితోడు నిరుద్యోగ సమస్య అత్యంత తీవ్రంగా విజృంభిస్తోంది. పాలకవర్గాలు ఎప్పటికప్పుడు పల్లికలిస్తూ పేదరికాన్ని నిర్మూలిస్తామని వాగ్దానాలు గుప్పిస్తు న్నాయి. అయితే వాళ్ళ ప్రయత్నాలన్నీ కూడా సముద్రంలో నీటి బొట్లుగానే ఫలితాలనిస్తున్నాయి. ఈనాడు మతోన్మాదాన్ని మినహాయిస్తే తీవ్రవాదులుగా ఉగ్రవాదులుగా మారుతోన్న యువతరానికి కరువైంది, దిశానిర్దేశమేనన్నది అక్షరసత్యం.

అందుకే ముందు అక్షరాస్యత శాతాన్ని కాకుండా నిజమైన అక్షరయోధులుగా భావితరాల్ని తయారుచేసేప్పుడు మాత్రమే సమస్యకి పరిష్కారం సైతం శాస్త్రీయంగా సాధించబడుతుంది.

## అరాజకత్వమే ప్రజాస్వామ్యపు అత్యున్నత దశ !

ప్రస్తుతం నడుస్తున్నది క్షీణిస్తున్న ప్రజాస్వామ్యం. ధ్వంసమవుతున్న ధనస్వామ్యం. ఈ వ్యవస్థది మరణించబోయే సుఖరోగి దశ. కనుకనే వ్యక్తిగత సుఖాలన్నీ సమిష్టిగా మనం భావిస్తుంటాం. అందంగా కనిపించే భ్రాంతుల్ని ఆలింగనం చేసుకుని వాటికి అప్రయత్నంగానే అమ్ముడుపోతుంటాం. మనకంటూ సొంతంగా శరీరాలు తప్ప అంతరాత్మలుండవు. అస్తిత్వాలే కాని వ్యక్తిత్వాలుండవు. బతుకీడ్చడవే జీవితమనుకుంటూ జీవచ్ఛవల్లా నలుగురితో పాటు నలుగుతుంటాం. నలుగుతూనే నశిస్తాం. ఇక వెలిగించుకుని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకునే తీరికెక్కడిది మనకి? తీరిగ్గా అరువు తత్వాలన్నింటినీ మిశ్రమంగా మనలో మలుచుకోవం తప్పా. మనకి పూర్తిగా మన గురించి ఆలోచించుకునేందుకు తీరికలేదు. ఇక సమయాన్ని సమాజం కోసం కేటాయించడమనేదిక్కడ అప్రస్తుతం. ఇన్ని అలౌకిక భావాల్ని, పారలౌకిక లక్షణాల్నీ పారద్రోలి ప్రగతి బాట పట్టినప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యపడుతుంది.

## అరాజకత్వ అభిమతం అభ్యుదయమే !

అరాజకత్వమెప్పుడూ అమానవత్వంగానో, మానవతాతీతంగా వ్యవహరించలేదు. అలాగని అనవసరపు మౌనాన్ని ఎన్నడూ పాటించలేదు. అవసరమయినప్పుడు పరిస్థితుల్ని ప్రతిఘటిస్తూనే సాధారణ స్థితిలో శాంతి మార్గాన్నే ఎన్నుకుంటుంది. తనని తాను ఎల్లప్పుడూ సంస్కరించుకునేందుకు సిద్ధంగా వుంటూనే మానవాళికి మెరుగైన మార్గం చూపించడం తన బాధ్యతగా భావిస్తుంది. భావి తరాలకి ఉన్నత విలువల్ని అందించడం కోసం

తన వంతు పాత్రని నిర్వహిస్తుంది. ప్రస్తుత రాజకీయాల్ని తులనాడుతూనే రాజకీయాల్లో అభివృద్ధికర మార్పుల కోసం ప్రయత్నిస్తూ వుంటుంది. మానవుల జన్మత: హక్కుల సాధనకోసం శ్రమిస్తూనే నవతరాల్లో నూతన బీజాలు నాటడానికి ప్రయత్నిస్తుంది. అరాజకత్వం అతివాద వైఖరిని (Radical Movement) సమర్ధిస్తుందంటే దానర్ధం హింసాత్మక చర్యల్ని ప్రేరేపిస్తుందని కాదు. సమాజాన్ని సమూలంగా మార్చాలని వాదించే వారిని అతివాదులుగా చూడాలి తప్ప అతివాదులం దరూ హంతకులో, హింసని సమర్ధించే సమూహాలో మాత్రం కాదు. "We are already to be savages in some cause. The differance between a good man and a bad one is the choice of the cause." అంటాడు అయిన్‌స్టీన్. అయితే మన స్వభావాల్లోన్ని అసాంఘికత్వాన్ని ఎంత విసర్జించే మనేదానిపైనే నాగరికులుగా మన ప్రగతి గతి ఆధారపడి ఉంటుంది. ఆంగ్లంలో ఒక ఆర్యోక్తుంది. "It is easy to be brave from a safe distance." అని. నిజమే! ప్రస్తుతం మన స్థితదే. మన అస్తిత్వానికి ఢోకా లేనంతవరకూ ఏ వాదన్నయినా - వివాదాన్నయినా, ఎంత గొప్ప సిద్ధాంతాన్నయినా - చెత్త రాద్ధాంతాన్నయినా అనుకరించడానికి వెనుకాడం. బాహ్యంగా మన బుద్ధి కుశలతని ప్రదర్శించే అవకాశాన్ని వదలం. అయితే ఆశ్రయించినది అతి వాస్తవికమయినదీ, నిర్భయంగా నిజం చెప్పేది అయితే మాత్రం మళ్ళీ మన తెల్లమొహాలేసుకుని ఎలక కన్నాల్లోకి దూరి బ్రతకడం పేరుతో రోజూ ఛస్తుంటాం. దాన్నే జీవితమంటారని భ్రమిస్తున్నాం. ఈ రోజుకీ మన తాతల ఊసుల్తో కాలక్షేపం చేయడం తప్ప మనకంటూ ఏడ్చిన సొంత మెదళ్ళను ఉపయోగించం. ఇప్పటికయినా ఇరుకు భావాల్నొదిలి ప్రపంచా న్నొక్కసారి ప్రశాంతంగా పరిశీలించండి. మీకేర్పడ్డ భావాల్లో ఒక్కటయినా గాయపడ్డ ప్రజల పక్షం వహిస్తుందేమో చూడండి.

ప్రస్తుతం నడుస్తున్నది క్షీణిస్తున్న ప్రభుస్వామ్యం.
ధ్వంసమవుతున్న ధనస్వామ్యం.

ఈ వ్యవస్థది మరణించబోయే సుఖరోగి దశ. కనుకనే వ్యక్తిగత సుఖాలన్నీ సమిష్టిగా మనం భావిస్తుంటాం. అందంగా కనిపించే భ్రాంతుల్ని ఆలింగనం చేసుకుని వాటికి అప్రయత్నంగానే అమ్ముడుపోతుంటాం.

మనకంటూ సొంతంగా శరీరాలు తప్ప అంతరాత్మలుండవు. అస్తిత్వాలే కాని వ్యక్తిత్వాలుండవు. బతుకీడ్చడమే జీవితమనుకుంటూ జీవచ్ఛవాల్లా నలుగురితో పాటు నలుగుతుంటాం. నలుగుతూనే నశిస్తాం. ఇక వెలిగించుకుని వ్యక్తిత్వాల్ని తీర్చిదిద్దుకునే తీరికెక్కడిది మనకి? తీరిగ్గా అరువు తత్వాలన్నింటినీ మిశ్రమత్వంగా మనలో మలచుకోవడం తప్ప, మనకి పూర్తిగా మన గురించి ఆలోచించుకునేందుకే తీరిక లేదు. ఇక సమయాన్ని సమాజం కోసం కేటాయించడమనేదిక్కడ అప్రస్తుతం. ఇన్ని అలౌకిక భావాల్ని. పారలౌకిక లక్ష్యాల్నీ పారద్రోలి ప్రగతిబాట పట్టినప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యపడుతుంది.

Price : 10/-